శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# సంక్షేప రామాయణం

**(చిత్రములతో కూడిన ఆంధ్రానువాదము)**


అనువక్త:

***పండితరత్న, వేదాన్తవాచస్పతి***

**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు**





కూర్పు :

ఈయుణ్ణి అనంత రంగ రామన్



**మే, 2021**

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

## నివేదన

శ్రీరామాయణంలోని మొదటి సర్గ అయిన 'సంక్షిప్త రామాయణం' అందరికీ సుపరిచితమే. ఇది రామాయణానికి సంగ్రహ రూపం, నిత్యానుసంధేయం.; దీనికి అస్మత్ పితృ పాదులు ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి శింగరాచార్య; స్వామి వారి అనువాదం ఇంతకుముందే అచ్చు వేయబడి ఉన్నా, దీనికి ఈమధ్య లభ్యమైన రామాయణంలోని ముఖ్య ఘట్టాలను తెలిపే చిత్రాలను జోడించి ప్రకృత గ్రంథం సిద్ధం చేయబడింది. ఈ చిరు గ్రంథం రామ పిరాన్ గుణానుభవం పొందే ఆస్తిక పాఠకులకు కైంకర్య రూపంగా సమర్పింపబడుతున్నది.

భవదీయుడు
ఈయుణ్ణి అనంత రంగ రామన్



# సంక్షేప రామాయణమ్

**తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ ।**
**నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్ ॥ 1**

తపస్సులో, స్వాధ్యాయంలో (తమ శాఖకు చెందిన వేదాన్ని నేర్చుకోవడంలో) నిరంతరం ఆసక్తిని కలవాడు, వాగ్విదులలో గొప్పవాడు, మునిశ్రేష్ఠుడైన నారదుని, గొప్ప తపస్సును కల వాల్మీకి మహాముని ఈ విధంగా ప్రశ్నించాడు.

**కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్ ।**
**ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః ॥ 2**

ఇపుడు ఈలోకంలో గుణవంతుడెవడు? వీర్యవంతుడెవడు? ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యాన్ని పలికేవాడు, దృఢమైన వ్రతాన్ని కలవాడెవడు?

**చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః ।**
**విద్వాన్ కః కః సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః ॥ 3**

మంచి ఆచరణను కలవాడెవడు? అన్ని ప్రాణులపట్ల మేలును కోరేవాడెవడు? సకలశాస్త్రాలను తెలిసినవాడెవడు? సర్వకార్యాలను నెరవేర్చగలవాడెవడు? చూచేవారికి ఆనందాన్ని కల్గించే రూపాన్ని కలవాడెవడు?

**ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోనసూయకః ।**
**కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే ॥ 4**

ధైర్యవంతుడెవడు? క్రోధాన్ని జయించినవాడెవడు? కాంతిని కలవాడెవడు? అసూయ లేనివాడెవడు? యుద్ధంలో ఎవనికి కోపం వస్తే దేవతలు కూడా భయపడతారు?

**ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే ।**
**మహర్షే! త్వం సమర్థోసి జ్ఞాతుమేవం విధం నరమ్ ॥ 5**

ఈ విషయాన్ని తెలిసికోవాలని నాకు మిక్కిలి కుతూహలంగా ఉన్నది. ఓ మహర్షీ ! నీవు ఇటువంటివానిని తెలిసికోవడంలో సమర్థుడవు.

**శ్రుత్వా చైతత్ త్రిలోకజ్ఞో వాల్మీకే ర్నారదో వచః ।**
**శ్రూయతామితి చామంత్ర్య ప్రహృష్టో వాక్యమబ్రవీత్ ॥ 6**

వాల్మీకి పల్కిన ఈ మాటను త్రిలోకజ్ఞుడైన నారదుడు విని "నీవడిగిన దానికి సమాధానం పల్కుతాను, విను" అని హెచ్చరిస్తూ ఆనందించి ఈ విధంగా మాటను పలికాడు.

బహవో దుర్లభాశ్చైవ యే త్వయా కీర్తితా గుణాః ।
మునే! వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తః శ్రూయతాం నరః ॥ 7

ఓ మునీ ! నీవు కీర్తించిన గుణాలు అనేకం, అవి దుర్లభాలు కూడా. ఆ గుణాలు కల నరుడెవడో తెలిసికొని, జ్ఞప్తి తెచ్చుకొని చెబుతాను. విను.

ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః ।
నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ ॥ 8

ఇక్ష్వాకువంశంలో జన్మించినవాడు, ప్రజలందరి చేత రాముడనే పేరుతో ప్రసిద్ధి పొందినవాడు ఒకడు ఉన్నాడు. అతడు గొప్ప రూపాన్ని కలవాడు. గొప్ప వీర్యాన్ని కలవాడు. గొప్ప ప్రకాశాన్ని కలవాడు, ధైర్యాన్ని కలవాడు. తన గుణాలతో జనులను వశం చేసికొనగలవాడు.





బుద్ధిమాన్ నీతిమాన్ వాగ్మీ శ్రీమాన్ శత్రునిబర్హణః ।
విపులాంసో మహాబాహుః కంబుగ్రీవో మహాహనుః ॥ 9

సర్వజ్ఞుడు. మర్యాదను కలవాడు. (తెలిసినవాడు) చక్కగా మాట్లాడగలవాడు. సమస్తలోకాలను నియమించడమనే ఐశ్వర్యాన్ని కలవాడు. శత్రువులను నశింపజేయ గలవాడు, విశాలమైన (బాహు) మూపురాలను కలవాడు, బలమైన బాహువులను కలవాడు, శంఖంవంటి అందమైన కంఠాన్ని కలవాడు, బలమైన దవుడలను కలవాడు.



మహోరస్కో మహేష్వాసో గూఢజత్రు రరిందమః ।
అజానుబాహు స్సుశిరాః సులలాటః సువిక్రమః ॥ 10

విశాలమైన వక్షస్సును కలవాడు, గొప్ప వింటిని కలవాడు, మిక్కిలి బలిష్ఠంగా ఉన్నందున కన్పించని మూపుల సంధులను (భుజసంధులను) కలవాడు,

శత్రువులను అరికట్టగలవాడు, మోకాళ్ళవరకు వేలాడే బాహువులను కలవాడు, చక్కని శిరస్సును కలవాడు, చక్కని లలాటాన్ని కలవాడు, చక్కని పరాక్రమాన్ని కలవాడు.



సమః సమవిభక్తాంగః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్ ।
పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః ॥ 11

సమపరిమాణాన్ని కలవాడు, చక్కని అవయవాల విభాగాన్ని కలవాడు, ఆకర్షణీయమైన వర్ణాన్ని కలవాడు, ప్రతాపాన్ని కలవాడు, బలమైన వక్షఃస్థలాన్ని విశాలమైన నేత్రాలను కలవాడు, చక్కని అవయవశోభను కలవాడు, ఇంకా పలు శుభలక్షణాలను కలవాడు.

ధర్మజ్ఞః సత్యసంధశ్చ ప్రజానాం చ హితే రతః ।
యశస్వీ జ్ఞానసంపన్నః శుచిర్వశ్యః సమాధిమాన్ ॥ 12



శరణాగతి ధర్మాన్ని తెలిసినవాడు, సత్యమైన ప్రతిజ్ఞను కలవాడు, ప్రజలకు మేలు చేయడంలో ఆసక్తిని కలవాడు, ఆశ్రితులను రక్షిస్తాడనే కీర్తిని కలవాడు, అన్నిటిని వివరంగా తెలిసినవాడు, పావనుడు, ఆశ్రితులకు పరతంత్రుడు, ఆశ్రితరక్షణలో ఆలోచన కలవాడు.



ప్రజాపతిసమః శ్రీమాన్ ధాతా రిపునిషూదనః ।
రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా ॥ 13

బ్రహ్మతో సమానుడు, శ్రీమంతుడు, శత్రువులను నిరసించేవాడు, జీవకోటిని రక్షించేవాడు, ధర్మాన్ని రక్షించేవాడు,

రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా ।
వేదవేదాంగాతత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః ॥ 14

తన ధర్మాన్ని రక్షించేవాడు, తనవారిని రక్షించేవాడు, వేద-వేదాంగాల తత్త్వాన్ని తెలిసినవాడు, ధనుర్వేదంలో సమర్థుడు.

సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్ ।
సర్వలోకప్రియః సాధు రదీనాత్మా విచక్షణః ॥ 15

అన్ని శాస్త్రాల అర్థతత్త్వాన్ని తెలిసినవాడు, వానిని మఱువనినాడు, ప్రతిభను కలవాడు, అందఱికి ఇష్టమైనవాడు, సజ్జనుడు, కొఱత లేని మనస్సు కలవాడు, వస్తువులలో సూక్ష్మభేదాన్ని గ్రహించగలవాడు. (వివేకాన్ని కలవాడు)





సర్వదాభి గతస్సద్భిః సముద్ర ఇవ సింధుభిః ।
ఆర్యః సర్వసమశ్చైవ సదైకప్రియదర్శనః ॥ 16

నదులు సదా సముద్రాన్ని చేరేటట్లు, ఎల్లప్పుడు సజ్జనులచే పొందబడేవాడు, దరిచేరదగినవాడు, అందఱిపట్ల సమానుడు, ఎల్లప్పుడు వినూత్నంగా తోచే రూపాన్ని కలవాడు.



స చ సర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః ।
సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ ॥ 17

ఇటువంటి అన్ని గుణాలను కలవాడు. కౌసల్యాదేవి కుమారుడు అతడు. గాంభీర్య గుణంలో సముద్రంతో ధైర్యంలో హిమవంతునితో సమానుడు.





విష్ణునా సదృశో వీర్యే సోమవత్ ప్రియదర్శనః ।
కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః ॥ 18

వీర్యగుణంలో విష్ణువుతో సమానుడు, చంద్రునివలె ప్రియమైన స్వభావాన్ని, రూపాన్ని కలవాడు, కోపం వస్తే ప్రళయాగ్నివంటివాడు, క్షమాగుణంలో భూమివంటివాడు.

ధనదేన సమ స్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః ।
తమేవం గుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్ ॥ 19

త్యాగంలో కుబేరునితో, సత్యగుణంలో ధర్మదేవతతో సమానుడు. ఈవిధంగా సర్వగుణ సంపన్నుడు, వ్యర్థంకాని పరాక్రమాన్ని కలవాడు.



జ్యేష్ఠం శ్రేష్ఠగుణైర్యుక్తం ప్రియం దశరథః సుతమ్ ।
ప్రకృతీనాం హితైర్యుక్తం ప్రకృతిప్రియకామ్యయా ॥ 20

యౌవరాజ్యేన సంయోక్తుమ్ ఐచ్ఛత్ ప్రీత్యా మహీపతిః ।

తన కుమారులలో మొదటివాడు, శ్రేష్ఠమైన గుణాలను కలవాడు, తనకు ప్రియమైన వాడు, ప్రజలకు హితాన్ని కల్గించేపనులను చేసేవాడైన శ్రీరాముని దశరథుడు ప్రజల అభీష్టానుసారం యువరాజ పట్టాభిషేకాన్ని చేయాలని ప్రీతితో సంకల్పించాడు.



తస్యాభిషేకసంభారాన్ దృష్ట్వా భార్యాథ కైకయీ ॥ 21
పూర్వం దత్తవరా దేవీ వరమేన మయాచత ।
వివాసనం చ రామస్య భరతస్యాభిషేచనమ్ ॥ 22

అపుడు శ్రీరాముని పట్టాభిషేకంకోసం సిద్ధంచేసిన సామగ్రిని దశరథుని భార్య



కైకేయి చూచి, తనకు పూర్వం దశరథుడు వరాలను ఇచ్చినందున, రాముని వనవాసాన్ని, భరతుని పట్టాభిషేకాన్ని వరాలుగా అడిగింది.



స సత్యవచనాద్రాజా ధర్మపాశేన సంయతః ।
వివాసయామాస సుతం రామం దశరథః ప్రియమ్ ॥ 23

ఆ దశరథుడు ధర్మపాశానికి అధీనుడై, సత్యాన్ని పలికేవాడైనందున, తనకు మిక్కిలి ప్రియమైన కుమారుని శ్రీరాముని అరణ్యానికి పంపాడు.





స జగామ వనం వీరః ప్రతిజ్ఞామనుపాలయన్ ।
పితుర్వచననిర్దేశాత్ కైకేయ్యాః ప్రియకారణాత్ ॥ 24

ఆ రాముడు రాజ్యాన్ని పాలించడంలో సమర్థుడైనా, కైకేయికి సంతోషం కల్గిస్తుందనే కారణంవల్ల, తండ్రి ఆజ్ఞవల్ల, కైకేయి ముందు తాను చేసిన ప్రతిజ్ఞను నెరవేరుస్తూ అడవికి వెళ్ళాడు.



తం వ్రజంతం ప్రియో భ్రాతా లక్ష్మణోనుజగామ హ ।
స్నేహాద్వినయసంపన్నః సుమిత్రానందవర్ధనః ॥ 25

భ్రాతరం దయితో భ్రాతుః సౌభ్రాత్ర మనుదర్శయన్ ।

రామునిపట్ల ప్రీతిని కల సోదరుడు, సుమిత్ర ఆనందాన్ని వృద్ధి చేసేవాడైన లక్ష్మణుడు సౌభ్రాత్రాన్ని (మంచి తోబుట్టువుతనాన్ని) వ్యక్తం చేస్తూ అన్నను అనుసరించి తాను కూడా అరణ్యానికి వెళ్ళాడు.

రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమాహితా ॥ 26

జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా ।
సర్వలక్షణసంపన్నా నారీణాముత్తమా వధూః ॥ 27

శ్రీరామునకు ప్రియమైన భార్య, నిత్యం ప్రాణాలతో సమానమైనది, జనక కులంలో పుట్టినది, విష్ణువుయొక్క ఆశ్చర్యకరమైన శక్తి అయిన మాయ మూర్తీభవించినట్లున్నది, అన్ని శుభలక్షణాలతో కూడినది, స్త్రీలలో ఉత్తమురాలైన
-

సీతాప్యనుగతా రామం శశినం రోహిణీ యథా ।
పౌరైరనుగతో దూరం పిత్రా దశరథేన చ ॥ 28

సీతాదేవి రోహిణి చంద్రునివలె, శ్రీరాముని అనుసరించి అరణ్యానికి వెళ్ళింది. పౌరులు, తండ్రి దశరథుడు అతనిని కొంతదూరం అనుసరించారు.

శృంగిబేరపురే సూతం గంగాకూలే వ్యసర్జయత్ ।
గుహమాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియమ్ ॥ 29

గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా ।
తే వనేన వనం గత్వా నదీ స్తీర్త్వా బహూదకాః ॥ 30

శ్రీరాముడు శృంగిబేరపురంలో గంగానదీతీరంలో సుమంత్రుని విడచిపెట్టాడు. శృంగి బేరపురంలో బోయ కులానికి నాయకుడు, తనకు మిక్కిలి ఇష్టమైనవాడైన గుహుని ధర్మాత్ముడైన శ్రీరాముడు కలిశాడు. గుహునితో, సీతతో, లక్ష్మణునితో పాటు శ్రీరాముడు గంగానదిని దాటాడు. వారు, ఒక వనం తరువాత ఇంకొక వనాన్ని, నీటితో నిండిన పలు నదులను దాటి-







చిత్రకూటమనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్ ।
రమ్యమావసథం కృత్వా రమమాణా వనే త్రయః ॥ 31
దేవగంధర్వసంకాశాః తత్ర తే న్యవసన్ సుఖమ్ ।

క్రమంగా చిత్రకూటపర్వతాన్ని చేరి, అక్కడ భరద్వాజ మహర్షి ఆజ్ఞానుసారంగా అందమైన ఆశ్రమాన్ని నిర్మించుకొన్నారు. దేవతలతో, గంధర్వులతో సమానులైనవారు ముగ్గురు ఆ వనంలో ఆనందంగా, విహరిస్తూ అక్కడ సుఖంగా నివసించారు.





చిత్రకూటం గతే రామే పుత్రశోకాతురస్తథా ॥ 32
రాజా దశరథః స్వర్గం జగామ విలపన్ సుతమ్ ।

శ్రీరాముడు చిత్రకూటాన్ని చేరే సమయానికి ప్రభువు దశరథుడు పుత్రశోకంతో బాధపడినవాడై, శ్రీరాముని గూర్చి పలవరిస్తూ స్వర్గానికి చేరాడు.



మృతే తు తస్మిన్ భరతో వసిష్ఠప్రముఖైర్ద్విజైః ॥ 33
నియుజ్యమానో రాజ్యాయ నైచ్ఛద్రాజ్యం మహాబలః ।

అతడు మరణించగా, మహాబలుడైన భరతుడు, వశిష్ఠుడు మొదలైన బ్రాహ్మణులు తనను రాజ్యాన్ని పాలించమని పల్కినా, రాజ్యాన్ని కోరలేదు.

స జగామ వనం వీరో రామపాదప్రసాదకః ॥ 34

గత్వా తు సుమహాత్మానం రామం సత్యపరాక్రమమ్ ।
అయాచత్ భ్రాతరం రామమ్ ఆర్యభావపురస్కృతః ॥ 35

ఆ వీరుడైన భరతుడు, పూజ్యుడైన రాముని అనుగ్రహాన్ని పొందగోరి అరణ్యానికి వెళ్ళాడు. మహాత్ముడు, సత్యపరాక్రముడైన రామునివద్దకు వెళ్ళాడు. అక్కడ రామునిచే గౌరవింపబడిన భరతుడు (రాజ్యానికి తిరిగి రమ్మని) రాముని అర్థించాడు.



త్వమేవ రాజా ధర్మజ్ఞః ఇతి రామం వచోఽబ్రవీత్ ।
రామోపి పరమోదారః సుముఖః సుమహాయశాః ॥ 36

న చైచ్ఛత్ పితురాదేశాత్ రాజ్యం రామో మహాబలః ।

"నీవు రాజువు, ధర్మాన్ని తెలిసినవాడవు" అని భరతుడు శ్రీరామునితో పలికాడు.



గొప్ప ఔదార్యాన్ని కలవాడు, అందమైన ముఖాన్ని కలవాడు, గొప్ప కీర్తిని కలవాడు, గొప్ప బలాన్ని కలవాడైనప్పటికీ, రాముడు, తండ్రి ఆదేశంవల్ల, రాజ్యపాలనకు అంగీకరించలేదు.

పాదుకే చాస్య రాజ్యాయ న్యాసం దత్త్వా పునః పునః ॥ 37

నివర్తయామాస తతో భరతం భరతాగ్రజః ।

భరతునకు తన పాదుకలను రాజ్యపాలనకోసం న్యాసంగా ఇచ్చి, భరతాగ్రజుడైన శ్రీరాముడు అతనిని తిరిగి పంపించాడు.

స కామమనవాప్యైవ రామపాదావుపస్పృశన్ ॥ 38

నందిగ్రామేఽకరోద్రాజ్యం రామాగమనకాంక్షయా ।

భరతుడు తన ఆశ నెరవేరకుండానే, రాముని పాదాలను (పాదుకలను) సేవిస్తూ, అతని రాకను ఎదురు చూస్తూ నందిగ్రామంలో నివసించి, రాజ్యపాలనను చేశాడు.



గతే తు భరతే శ్రీమాన్ సత్యసంధో జితేంద్రియః ॥ 39

రామస్తు పునరాలక్ష్య నాగరస్య జనస్య చ ।
తత్రాగమన మేకాగ్రో దండకాన్ ప్రవివేశ హ ॥ 40

భరతుడు తిరిగి వెళ్ళిపోయిన తరువాత, ఆనందంతో ప్రకాశించేవాడు, సత్యమైన ప్రతిజ్ఞను కలవాడు, జితేంద్రియుడైన రాముడు, నగర ప్రజలకు మళ్ళీ తన దగ్గరకు వచ్చి ప్రార్థిస్తారని తలచి, ఏకాగ్రతను కలవాడై దండకారణ్యాన్ని ప్రవేశించాడు.





ప్రవిశ్య తు మహారణ్యం రామో రాజీవలోచనః ।
విరాధం రాక్షసం హత్వా శరభంగం దదర్శ హ ॥ 41

సుతీక్ష్ణం చాప్యగస్త్యం చ అగస్త్యభ్రాతరం తథా ।

పద్మాలవలె అందమైన నేత్రాలను కల రాముడు మహారణ్యాన్ని ప్రవేశించి, విరాధుడనే రాక్షసుని చంపి, శరభంగమునిని దర్శించాడు. తరువాత సుతీక్ష్ణుడు, అగస్త్యుడు, అగస్త్యభ్రాత - అనే వారిని దర్శించాడు.



అగస్త్యవచనాచ్చైవ జగ్రాహైంద్రం శరాసనమ్ ॥ 42

ఖడ్గం చ పరమప్రీతః తూణీ చాక్షయసాయకౌ ।

శ్రీరామచంద్రుడు మిక్కిలి ప్రీతిని కలవాడై, అగస్త్యుని మాటప్రకారం ఇంద్రుని విల్లును, ఖడ్గాన్ని, అక్షయతూణీరాన్ని, బాణాలను స్వీకరించాడు.





వసత స్తస్య రామస్య వనే వనచరైస్సహ ॥ 43

ఋషయోఽభ్యాగమన్ సర్వే వధాయాసురరక్షసామ్ ।
స తేషాం ప్రతిశుశ్రావ రాక్షసానాం తథా వనే ॥ 44

ఆ అరణ్యంలో నివసించే ఋషులతో కలసి శ్రీరాముడు నివసిస్తూ ఉండగా, అక్కడ రాక్షససంహారాన్ని కోరి ఋషులంతా శ్రీరామునివద్దకు (శరణువేడుతూ) వచ్చారు. ఆ రాక్షసవనంలో శ్రీరాముడు వారికి మాట ఇచ్చాడు.

ప్రతిజ్ఞాతశ్చ రామేణ వధస్సంయతి రక్షసామ్ ।
ఋషీణా మగ్నికల్పానాం దండకారణ్యవాసినామ్ ॥ 45

దండకారణ్యవాసులు, అగ్నివంటివారైన ఋషులకు శ్రీరాముడు రాక్షస సంహారాన్ని యుద్ధంలో చేస్తానని ప్రతిజ్ఞచేశాడు.



**తేన తత్రైవ వసతా జనస్థాననివాసినీ ।**
**విరూపితా శూర్పణఖా రాక్షసీ కామరూపిణీ ॥ 46**

ఆ దండకారణ్యంలో శ్రీరాముడు నివసిస్తూ ఉండగా, జన్మస్థానంలో నివసించేది, కామరూపాన్ని కల్గినది, అయిన శూర్పణఖ అనే రక్కసి శ్రీరామునిచే విరూపాన్ని పొందింది. (ముక్కు చెవులు కోయబడింది)



**తత శ్శూర్పణఖావాక్యాత్ ఉద్యుక్తాన్ సర్వరాక్షసాన్ ।**
**ఖరం త్రిశిరసం చైవ దూషణం చైవ రాక్షసమ్ ॥ 47**

**నిజఘాన రణే రామః తేషాం చైవ పదానుగాన్ ।**

తరువాత, శూర్పణఖమాటవల్ల యుద్ధానికి సిద్ధపడిన రాక్షసులను అందఱిని, ఖరుని, త్రిశిరుని, దూషణుడనే రాక్షసుని, వారి అనుచరులను కూడా రాముడు యుద్ధంలో సంహరించాడు.

**వనే తస్మిన్ నివసతా జనస్థాననివాసినామ్ ॥ 48**
**రక్షసాం నిహతాన్యాసన్ సహస్రాణి చతుర్దశ ।**



ఆ అరణ్యంలో నివసించే రాముడు జనస్థానంలో నివసించే పధ్నాలుగు వేలమంది రాక్షసులను చంపాడు.

**తతో జ్ఞాతివధం శ్రుత్వా రావణః క్రోధమూర్ఛితః ॥ 49**
**సహాయం వరయామాస మారీచం నామ రాక్షసమ్ ।**

తరువాత, తన జ్ఞాతులైన రాక్షసులు చంపబడిన విషయాన్ని విని, రావణుడు మిక్కిలి కోపంతో మూఢుడై, సీతాహరణార్థం మారీచుని సహాయం కోరాడు.

**వార్యమాణః సుబహుశో మారీచేన స రావణః ॥ 50**
**న విరోధో బలవతా క్షమో రావణ! తేన తే ।**

మారీచుడు రావణుతో - “రావణా! బలవంతుడైన రామునితో నీకు విరోధం తగ”దని పలుమార్లు వారించాడు.

**అనాదృత్య తు తద్వాక్యం రావణః కాలచోదితః ॥ 51**

**జగామ సహ మారీచః తస్యాశ్రమపదం తదా ।**
**తేన మాయావినా దూరమ్ అపవాహ్య నృపాత్మజౌ ॥ 52**

మృత్యువుచే ప్రేరేపింపబడిన రావణుడు అతని మాటను అనాదరించి, మారీచునితో కలసి, శ్రీరాముని ఆశ్రమానికి వెళ్ళాడు.



**జహార భార్యాం రామస్య గృధ్రం హత్వా జటాయుషమ్ ।**
**గృధ్రం చ నిహతం దృష్ట్వా హృతాం శ్రుత్వా చ మైథిలీమ్ ॥ 53**
**రాఘవ శ్శోకసంతప్తో విలలాపాకులేంద్రియః ।**

జటాయువును సంహరించి రాముని భార్యను అపహరించాడు. మరణించే దశలో ఉండే జటాయువును చూచి, సీత అపహరింపబడినదని తెలిసి శ్రీరాముడు శోకంతో చాలా తాపాన్ని పొందాడు. ఇంద్రియవ్యాకులాన్ని పొంది రోదించాడు.







**తత స్తేనైవ శోకేన గృధ్రం దగ్ధ్వా జటాయుషమ్ ॥ 54**

**మార్గమాణో వనే సీతాం రాక్షసం సందదర్శ హ ।**
**కబంధం నామ రూపేణ వికృతం ఘోరదర్శనమ్ ॥ 55**

తరువాత, ఆ దుఃఖంతోనే, జటాయువుకు అగ్నిసంస్కారాన్ని చేసి, అడవిలో సీతను వెదకుతూ, చాలా ఘోరమైన, వికృతమైన రూపాన్ని కల, కంబంధుడనే పేరు కల రాక్షసుని శ్రీరాముడు చూచాడు.

**తం నిహత్య మహాబాహుః దదాహ స్వర్గతశ్చ సః ।**
**స చాస్య కథయామాస శబరీం ధర్మచారిణీమ్ ॥ 56**

**శ్రమణీం ధర్మనిపుణామ్ అభిగచ్ఛేతి రాఘవ ।**
**సోభ్యగచ్ఛన్మహాతేజాః శబరీం శత్రుసూదనః ॥ 57**

గొప్ప భుజాలను కల శ్రీరాముడు అతనిని చంపి దహించాడు. ఆ కబంధుడు కూడా స్వర్గాన్ని చేరాడు. ఆ కబంధుడు కూడా 'రాఘవా! నీవు, ధర్మాన్ని అనుష్ఠించేది, ధర్మంలో నేర్పు కల్గినది అయిన శబరి అనే సన్యాసిని దగ్గరకు వెళ్ళమని అన్నాడు.గొప్ప తపస్సును కలవాడు, శత్రువులను వధించేవాడైన శ్రీరాముడు శబరి దగ్గరకు వెళ్ళాడు.



శబర్యా పూజితస్సమ్యక్ రామో దశరథాత్మజః ।
పంపాతీరే హనుమతా సంగతో వానరేణ హ ॥ 58

హనుమద్వచనాచ్చైవ సుగ్రీవేణ సమాగతః ।

దశరథపుత్రుడైన రాముడు ఆ శబరిచే చక్కగా ఆరాధింపబడ్డాడు. పంపానదీ తీరంలో శ్రీరాముడు వానరుడైన హనుమంతుని కలిశాడు. హనుమంతుని మాటవల్ల శ్రీరాముడు సుగ్రీవునితో కలిశాడు.





సుగ్రీవాయ చ తత్సర్వం శంసద్రామో మహాబలః ॥ 59
ఆదిత స్తద్యథావృత్తం సీతాయాశ్చ విశేషతః ।

మహాబలుడైన శ్రీరాముడు సుగ్రీవునితో మొదటినుండి జరిగిన వృత్తాంతాన్ని అంతటిని, విశేషంగా సీతకు సంబంధించినదానిని తెలిపాడు.

చకార సఖ్యం రామేణ ప్రీతశ్చైవాగ్నిసాక్షికమ్ ।
సుగ్రీవ శ్చాపి తత్సర్వం శ్రుత్వా రామస్య వానరః ॥ 60

వానరుడైన సుగ్రీవుడు రాముని సంగతిని అంతా విని సంతోషించినవాడై, రామునితో అగ్నిసాక్షికంగా మైత్రిని చేసికొన్నాడు.

తతో వానరరాజేన వైరానుకథనం ప్రతి ॥ 61
రామాయావేదితం సర్వం ప్రణయాద్దుఃఖితేన చ ।

తరువాత, దుఃఖాన్ని పొందిన వానరప్రభువైన సుగ్రీవుడు వాలితో తనకు ఏర్పడిన విరోధాన్నిగూర్చి అంతా రామునితో స్నేహం వల్ల తెలిపాడు.

ప్రతిజ్ఞాతం చ రామేణ తదా వాలివధం ప్రతి ॥ 62

వాలినశ్చ బలం తత్ర కథయామాస వానరః ।
సుగ్రీవశ్శంకితశ్చాసీత్ నిత్యం వీర్యేణ రాఘవే ॥ 63

అపుడు శ్రీరాముడు వాలిని వధిస్తానని మాట ఇచ్చాడు. తరువాత సుగ్రీవుడు వాలి బలాన్నిగూర్చి రామునకు తెలిపాడు. సుగ్రీవుడు శ్రీరాముని వీర్యాన్నిగూర్చి సదా సందేహిస్తూ ఉండేవాడు.

రాఘవప్రత్యయార్థం తు దుందుభేః కాయముత్తమమ్ ।
దర్శయామాస సుగ్రీవో మహాపర్వతసన్నిభమ్ ॥ 64

శ్రీరాముని బలాన్ని నమ్మడంకోసం, సుగ్రీవుడు పెద్దకొండతో సమానమైన దుందుభి అనే రాక్షసునియొక్క, ఎత్తైన పెద్ద కొండవంటి అస్థిపంజరాన్ని శ్రీరామునకు చూపించాడు.

ఉత్స్మయిత్వా మహాబాహుః ప్రేక్ష్య చాస్థి మహాబలః ।
పాదంగుష్ఠేన చిక్షేప సంపూర్ణం దశ యోజనమ్ ॥ 65

మహాబలుడు, మహాబాహువైన శ్రీరాముడు దుందుభి అస్థిపంజరాన్ని చూచి, నవ్వి,

తన కాలిబొటనవేలితో పూర్తిగా పది యోజనాల దూరం పడేటట్లు ఎగుర గొట్టాడు.

బిభేద చ పునస్సాలాన్ సప్తైకేన మహేషుణా ।
గిరిం రసాతలం చైవ జనయన్ ప్రత్యయం తదా ॥ 66

అంతేకాక, శ్రీరాముడు ఏడు సాలవృక్షాలను, పర్వతాన్ని, పాతాళాన్ని కూడా సుగ్రీవునకు నమ్మం కల్గడంకోసం ఒక బాణంతో భేదించాడు.



తతః ప్రీతమనాశ్శైవ విశ్వస్త స్స మహాకపిః ।
కిష్కింధాం రామసహితో జగామ చ గుహాం తదా॥ 67

అపుడు విశ్వాసాన్ని పొంది సంతోషించి, గొప్ప వానరుడైన సుగ్రీవుడు రామునితో కలసి గుహవలె ఉండే కిష్కింధకు వెళ్ళాడు.

తతోగర్జద్ధరివరః సుగ్రీవో హేమపింగళః ।
తేన నాదేన మహతా నిర్జగామ హరీశ్వరః ॥ 68



తరువాత, బంగారువలె పింగళవర్ణాన్ని కలవాడు, వానర శ్రేష్ఠుడైన సుగ్రీవుడు వాలిని యుద్ధానికి పిలుస్తూ పెద్దగా గర్జించాడు.

అనుమాన్య తదా తారాం సుగ్రీవేణ సమాగతః ।
నిజఘాన చ తత్రైనం శరేణైకేన రాఘవః ॥ 69

అపుడు యుద్ధానికి పోవద్దని అడ్డగించిన తారను ఓదార్చి, ఒప్పించి వాలి సుగ్రీవునితో కలియబడ్డాడు. శ్రీరాముడు వాలిని ఒకే బాణంతో సంహరించాడు.



తత స్సుగ్రీవవచనాత్ హత్వా వాలిన మాహవే ।
సుగ్రీవమేవ తద్రాజ్యే రాఘవః ప్రత్యపాదయత్ ॥ 70

సుగ్రీవుని మాటవలన యుద్ధంలో వాలిని చంపి, తరువాత సుగ్రీవుని రాజ్యంలో నిలిపాడు (పట్టాభిషేకం చేశాడు).

స చ సర్వాన్ సమానీయ వానరాన్ వానరర్షభః ।
దిశః ప్రస్థాపయామాస దిదృక్షు ర్జనకాత్మజామ్ ॥ 71

వానరరాజైన సుగ్రీవుడు వానరులను అందఱిని పిలిపించి, జానకి అయిన సీతాదేవి జాడను తెలియగోరి నాల్గు దిక్కులలోకి పంపించాడు.





తతో గృధ్రస్య వచనాత్ సంపాతే ర్హనుమాన్ బలీ ।
శతయోజనవిస్తీర్ణం పుప్లువే లవణార్ణవమ్ ॥ 72

తరువాత బలాన్ని కల హనుమంతుడు సంపాతి అనే గ్రద్ద పల్కిన మాటను బట్టి నూఱు యోజనాల నిడివిని కల లవణసముద్రాన్ని దాటాడు.



తత్ర లంకాం సమాసాద్య పురీం రావణపాలితామ్ ।
దదర్శ సీతాం ధ్యాయంతీమ్ అశోకవనికాం గతామ్ ॥ 73

హనుమంతుడు రావణునిచే పాలింపబడే లంకను చేరి అక్కడ, అశోకవనంలో రామునిగూర్చి ధ్యానిస్తున్న సీతను చూచాడు.

నివేదయిత్వాభిజ్ఞానం ప్రవృత్తిం చ నివేద్య చ ।
సమాశ్వాస్య చ వైదేహీం మర్దయామాస తోరణమ్ ॥ 74

శ్రీరాముడిచ్చిన ఉంగరాన్ని గుర్తుగా ఆమెకు సమర్పించి, రామవృత్తాంతాన్ని ఆమెకు తెల్పి, ఆమెను ఓదార్చి, అశోకవనం బయటి ద్వారాన్ని భగ్నం చేశాడు.





పంచ సేనాగ్రగాన్ హత్వా సప్త మంత్రిసుతానపి ।
శూరమక్షం చ నిష్పిష్య గ్రహణం సముపాగమత్ ॥ 75

హనుమంతుడు అయిదుగురు సేనానాయకులను చంపి, ఏడుగురు మంత్రికుమారులను కూడా సంహరించి, శూరుడైన అక్షకుమారుని చూర్ణం చేసి, చివరకు బ్రహ్మాస్త్రంతో కట్టుబడ్డాడు.



అస్త్రేణోన్ముక్త మాత్మానం జ్ఞాత్వా పైతామహాద్వరాత్ ।
మర్షయన్ రాక్షసాన్వీరో యంత్రిణ స్తాన్ యదృచ్ఛయా ॥ 76

పరాక్రమాన్ని కలవాడు, గొప్పవానరుడైన హనుమంతుడు బ్రహ్మ ఇచ్చిన వరంవల్ల తన ప్రయత్నం లేకుండానే బ్రహ్మాస్త్రం నుండి విడివడి, స్మృతిని పొంది, తనను అటు ఇటు తాళ్ళతో లాగే రాక్షసులను క్షమిస్తూ....

తతో దగ్ధ్వా పురీం లంకామ్ ఋతే సీతాం చ మైథిలీమ్ ।
రామాయ ప్రియమాఖ్యాతుం పునరాయాన్మహాకపిః ॥ 77

మైథిలిని తప్ప మిగిలిన లంకాపట్టణాన్ని అంతటిని దహించి, శ్రీరామునకు

క్రియమైన సీత జాడను తెలియజేయడంకోసం మరల ఆ మహావానరుడు తిరిగివచ్చాడు.

**సోభిగమ్య మహాత్మానం కృత్వా రామం ప్రదక్షిణమ్ ।**
**న్యవేదయదమేయాత్మా దృష్టా సీతేతి తత్త్వతః ॥ 78**

గొప్ప బుద్ధిని కలవాడైన హనుమంతుడు మహాత్ముడైన శ్రీరాముని చేరి, ప్రదక్షిణంచేసి, "సీతను చూచాను" అని అంటూ అంతా యథాతథంగా తెలిపాడు.

**తతః సుగ్రీవసహితో గత్వా తీరం మహోదధేః ।**
**సముద్రం క్షోభయామాస శరై రాదిత్యసన్నిభైః ॥ 79**

అపుడు సుగ్రీవునితో కూడినవాడైన రాముడు మహాసముద్రతీరాన్ని చేరి, సూర్యునివంటి బాణాలతో సముద్రాన్ని క్షోభింపచేశాడు.

**దర్శయామాస చాత్మానం సముద్రః సరితాం పతిః ।**
**సముద్రవచనాచ్చైవ నలం సేతు మకారయత్ ॥ 80**

నదులకు పతి అయిన సముద్రుడు శ్రీరామునకు తన నిజరూపాన్ని చూపించాడు. సముద్రుని మాటను అనుసరించి శ్రీరాముడు నలునిద్వారా సేతువును నిర్మింపచేశాడు.





**తేన గత్వా పురీం లంకాం హత్వా రావణమాహవే ।**
**రామః సీతా మనుప్రాప్య పరాం వ్రీడాముపాగమత్ ॥ 81**

శ్రీరాముడు ఆ సేతువు ద్వారా లంకాపురిని చేరి, యుద్ధంలో రావణుని చంపి, సీతను తిరిగి పొంది, తరువాత (పరగృహంలో ఇన్నాళ్ళు ఉన్న ఆమెను తిరిగి స్వీకరించడ మెవిధంగా ?) అనే గొప్ప లజ్జను పొందాడు.



తాముువాచ తతో రామః పరుషం జనసంసది ।
అమృష్యమాణా సా సీతా వివేశ జ్వలనం సతీ ॥ 82

తరువాత శ్రీరాముడు జనసమూహంలో ఆమెనుగూర్చి కఠినంగా మాట్లాడాడు, ఆ మాటలను విని సహించలేని పతివ్రత అయిన సీత అగ్నిలో ప్రవేశించింది.

తతోగ్నివచనాత్ సీతాం జ్ఞాత్వా విగతకల్మషామ్ ।
బభౌ రామః సంప్రహృష్టః పూజితః సర్వదైవతైః ॥ 83

పిమ్మట శ్రీరాముడు అగ్ని దేవునిమాటను అనుసరించి సీతను నిర్దోషిగా గుర్తించి, ఆమెను స్వీకరించి సంతోషించినవాడై, సకలదేవతలచే పూజింపబడినవాడై ప్రకాశించాడు.



కర్మణా తేన మహతా త్రైలోక్యం సచరాచరమ్ ।
సదేవర్షిగణం తుష్టం రాఘవస్య మహాత్మనః ॥ 84

మహాత్ముడైన శ్రీరాముడు చేసిన ఆ గొప్ప కార్యంవల్ల చరాచరాలతో, దేవర్షి సముదాయంతో కూడిన ముల్లోకాలు సంతోషించాయి.

అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్ ।
కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ ॥ 85



శ్రీరాముడు, రాక్షసశ్రేష్ఠుడైన విభీషణునకు లంకలో పట్టాభిషేకాన్ని చేసి, కృత్యకృత్యుడై, మనస్సులో తాపం తీరి సంతోషించాడు.

దేవతాభ్యో వరం ప్రాప్య సముత్థాప్య చ వానరాన్ ।
అయోధ్యాం ప్రస్థితో రామః పుష్పకేణ సుహృద్వృతః ॥ 86

శ్రీరాముడు దేవతలవల్ల వరాన్ని పొంది, యుద్ధంలో చనిపోయిన వానరులను తిరిగి బ్రతికింపజేసి, వారితోపాటు, అయోధ్యానగరానికి సుగ్రీవాది స్నేహితులతో కూడి పుష్పకవిమానంపై బయలుదేరాడు.



భరద్వాజాశ్రమం గత్వా రామః సత్యపరాక్రమః ।
భరతస్యాంతికం రామో హనూమంతం వ్యసర్జయత్ ॥ 87

సత్యపరాక్రముడైన శ్రీరాముడు భరద్వాజ మహర్షివద్దకు చేరి, భరతుని వద్దకు

తన రాకను గూర్చి తెలుపడం కోసం హనుమంతుని పంపాడు.

పునరాఖ్యాయికాం జల్పన్ సుగ్రీవసహితశ్చ సః ।
పుష్పకం తత్సమారుహ్య నందిగ్రామం యయౌ తదా ॥ 88

సుగ్రీవునితో కలసి శ్రీరాముడు పుష్పకాన్ని ఎక్కి ప్రయాణం చేస్తూ, పూర్వం జరిగిన వృత్తాంతాలను మాటి మాటికి పల్కుతూ నందిగ్రామాన్ని చేరాడు.

నందిగ్రామే జటాం హిత్వా భ్రాతృభిః సహితోనఘః ।
రామః సీతా మనుప్రాప్య రాజ్యం పునరవాప్తవాన్ ॥ 89

ఏదోషం లేని శ్రీరాముడు నంది గ్రామంలో తన సోదరులతో కలసినవాడై, జటలను విడచి, సీతతో కూడి, మరల రాజ్యాన్ని పొందాడు.



ప్రహృష్టముదితో లోకః తుష్టః పుష్ట స్సుధార్మికః ।
నిరామయో హ్యరోగశ్చ దుర్భిక్షభయవర్జితః ॥ 90



శ్రీరాముడు రాజ్యపాలన చేస్తూ ఉండగా లోకం అంతా సంతోషించింది. మనస్సులో తృప్తి చెందింది. నిండుగా కన్పించింది. ప్రజలు ధర్మాచరణాన్ని చేశారు. వారు, ఏవిధమైన శారీరక వ్యాధులు, మానసిక రోగాలు లేనివారయ్యారు. అపుడు కరువు అనేది లేదు.

న పుత్రమరణం కించిత్ ద్రక్ష్యంతి పురుషాః క్వచిత్ ।
నార్యశ్చావిధవా నిత్యం భవిష్యంతి పతివ్రతాః ॥ 91

ఏ పురుషులు, ఎక్కడా, ఎపుడైనా తాము జీవించి ఉండగా తమ పుత్రుల మరణాన్ని చూడలేదు. (అకాల మరణాలు లేవు) స్త్రీలు వైధవ్యాన్ని పొందలేదు. నిత్యం పతివ్రతలై వర్తించారు.

న చాగ్నిజం భయం కించిత్ నాప్సు మజ్జంతి జంతవః ।
న వాతజం భయం కించిత్ నాపి జ్వరకృతం తథా ॥ 92

న చాపి క్షుద్భయం తత్ర న తస్కరభయం తథా ।

అపుడు అగ్నివల్ల భయం ఏ కొంచెం లేదు, మానవులు నీటిలో మునిగి చనిపోవడం లేదు. గాలివల్ల భయంలేదు. జ్వరం, ఆకలి, దొంగలు- అనే వీటివల్ల భయాలు అపుడక్కడలేవు.

నగరాణి చ రాష్ట్రాణి ధనధాన్యయుతాని చ ॥ 93
నిత్యం ప్రముదితా స్సర్వే యథా కృతయుగే తథా ।

నగరాలు, రాష్ట్రాలు, ధనధాన్యాలతో కూడినవి అయ్యాయి. కృతయుగంలోవలె జనులు అందఱు సదా సంతుష్టులయ్యారు.

అశ్వమేధశతై రిష్ట్వా తథా బహుసువర్ణకైః । 94

గవాం కోట్యయుతం దత్త్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి ।
అసంఖ్యేయం ధనం దత్త్వా బ్రాహ్మణేభ్యో మహాయశాః ॥ 95

గొప్ప కీర్తిని కల శ్రీరాముడు వందలకొలది అశ్వమేధయాగాలను, అదేవిధంగా, బహుసువర్ణకాలనే యజ్ఞాలను చేసి, వేలకోట్ల ఆవులను, లెక్కపెట్టలేనంత ధనాన్ని బ్రాహ్మణులకు దానం చేసి, బ్రహ్మలోకాన్ని చేరగలడు.

**రాజవంశాన్ శతగుణాన్ స్థాపయిష్యతి రాఘవః ।**
**చాతుర్వర్ణ్యం చ లోకేస్మిన్ స్వే స్వే ధర్మే నియోక్ష్యతి ॥ 96**

శ్రీరాముడు వందలాది రాజవంశాలను స్థాపించగలడు. ఈ లోకంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే నాల్గు వర్ణాలవారు తమ తమ ధర్మాలలో నడచేటట్లు శాసించ గలడు.

**దశ వర్షసహస్రాణి దశ వర్షశతాని చ ।**
**రామో రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి ॥ 97**

పదకొండు వందల సంవత్సరాల కాలంలో శ్రీరాముడు రాజ్యాన్ని పాలించి, పరమపదాన్ని తిరిగి చేరగలడు.

**ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్ ।**
**యః పఠేద్రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే ॥ 98**

పవిత్రం, పాపాన్ని పోగొట్టేది, పుణ్యం, వేదంతో సమానమైనది అయిన ఈ శ్రీరామచరిత్రను చదివేవాడెవడో, అతడు అన్ని పాపాలనుండి విముక్తుడవుతాడు.

**ఏతదాఖ్యాన మాయుష్యం పఠన్ రామాయణం నరః ।**
**సపుత్రపౌత్రః సగణః ప్రేత్య స్వర్గే మహీయతే ॥ 99**

ఆయుష్యాన్ని చేకూర్చే, సత్యమైన ఈ శ్రీరామాయణ గాథను చదివే నరుడు పుత్రపౌత్రులతో, బంధువర్గంతో కలసి, శరీరం నశించిన తర్వాత, స్వర్గలోకంలో పూజింపబడతాడు.

**పఠన్ ద్విజో వాగృషభత్వ మీయాత్ స్యాత్ క్షత్రియో భూమిపతిత్వ మీయాత్॥**
**వణిగ్జనః పణ్యఫలత్వ మీయాత్ జనశ్చ శూద్రోపి మహత్త్వ మీయాత్ ॥ 100**

శ్రీరామాయణాన్ని చదివేవాడు బ్రాహ్మణుడైతే అతడు మాటలో నేర్పరితనాన్ని, క్షత్రియుడైతే చక్రవర్తిత్వాన్ని, వైశ్యుడైతే వ్యాపారలాభాన్ని, శూద్రుడైతే సజాతీయులలో గొప్పతనాన్ని పొందగలడు.

**ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే బాలకాండే**
**నారదోక్తం సంక్షేపరామాయణమ్ నామ ప్రథమ స్సర్గః**